# అథ చతుర్వింశో%ధ్యాయః

## దేవతలు శివునితో మొరపెట్టుకొనుట

దేవా ఊచుః |

నమో రుద్రాయ దేవాయ మదనాంతకరాయ చ | స్తుత్యాయ భూరిభాసాయ త్రినేత్రాయ నమో నమః || 1

శిపివిష్టాయ భీమాయ భీమాక్షాయ నమో నమః | మహాదేవాయ ప్రభ##వే త్రివిష్టపతయే నమః || 2

త్వం నాథస్సర్వలోకానాం పితా మాతా త్వమీశ్వరః | శంభురీశశ్శంకరో%సి దయాలుస్త్వం విశేషతః || 3

త్వం ధాతా సర్వజగతాం త్రాతుమర్హసి నఃప్రభో | త్వాం వినా కస్సమర్థో%స్తి దుఃఖనాశే మహేశ్వర || 4

దేవతలిట్లు పలికిరి-

ప్రకాశస్వరూపుడు, మన్మథుని దహించినవాడు, స్తుతింపదగిన వాడు, గొప్ప తేజశ్శాలి, ముక్కంటి అగు రుద్రునకు అనేక నమస్కారములు (1). రశ్మలచే సర్వమును ప్రకాశింపజేయు ఆదిత్యుడు నీవే. భయంకరాకారుడు, భయమును గొల్పు కన్నులు గలవాడు, ప్రభుడు, మహాదేవుడు అగు నీకు నమస్కారము. నీవు ఇంద్రరూపుడవై స్వర్గమును పాలించుచున్నావు (2). లోకములన్నింటికీ నాథుడు, తండ్రి, తల్లి మరియు పాలకుడు నీవే. నీవు మంగళ స్వరూపుడవు, ఈశ్వరుడవు, మంగళముల నిచ్చువాడవు. నీయందు దయ విశేషముగా గలదు (3). హే ప్రభో! లోకములనన్నింటినీ పోషించునీవు మమ్ములను రక్షింప తగుదువు. మహేశ్వరా! దుఃఖమును పొగొట్టుటలో సమర్థుడు నీవు తక్క మరి ఎవ్వరు గలరు? (4)

బ్రహ్మోవాచ|

ఇత్యాకర్ణ్య వచస్తేషాం సురాణాం నందికేశ్వరః | కృఫయా పరయా యుక్తో విజ్ఞప్తుం శంభుమారభత్ || 5

బ్రహ్మ ఇట్లు పలికెను-

నందికేశ్వరుడు ఆ దేవతల ఈ మాటలను విని గొప్ప దయగలవాడై శంభునితో విన్నపమును చేయుటకారంభించెను (5).

నందికేశ్వర ఉవాచ |

విష్ణ్వా దయస్సురగణా మునిసిద్ధ సంఘాః త్వాం ద్రష్టుమేవ సురవర్య విశేషయంతి |

కార్యార్థినో%సురవరైః పరిభర్త్స్య మానాః సమ్యక్ పరాభవ పదం పరమం ప్రపన్నాః || 6

తస్మాత్త్వయా హి సర్వేశ త్రాతవ్యా మునయస్సురాః | దీనబంధుర్విశేషేణ త్వముక్తో భక్తవత్సలః || 7

నందికేశ్వరుడిట్లినెను-

విష్ణువు ప్రముఖముగా గల దేవగణములు, మునిగణములు, సిద్ధగణములు నిన్ను చూచుటకై వేచియున్నారు. ఓ దేవోత్తమా! గొప్ప రాక్షసులచే పీడింపబడి, తీవ్రమగు పరాభవమునకు గురియైన వీరలు నీ అనుగ్రహముచే కార్యసిద్ధిని గోరుచున్నారు (6). హే సర్వేశ్వరా! కావున నీవు మనునులను, దేవతలను రక్షించవలెను. నీవు విశేషించి దీనులకు బంధుడవని, భక్తవత్సలుడవని ఖ్యాతిని గాంచినావు (7).

బ్రహ్మోవాచ|

ఏవం దయావతా శంభుర్విజ్ఞప్తో నందినా భృశమ్ |
శ##నైశ్శనైరుపరమద్ధ్యానాదున్మీల్య చాక్షిణీ || 8

ఈశో%థోపరతశ్శంభుస్తదా పరమకోవిదః | సమాధేః పరమాత్మాసౌ సురాన్ సర్వానువాచ హ || 9

బ్రహ్మ ఇట్లు పలికెను-

దయాళువు అగు నంది ఇట్లు పరిపరివిధముల విన్నవించగా, శంభుడు మెల్లమెల్లగా ధ్యానమునుండి విరమించి కన్నులను తెరచెను (8). అపుడు ఈశ్వరుడు, పరమజ్ఞాని, పరమాత్మయగు ఈ శంభుడు సమాధిని ఉపసంహరించి, దేవతలందరితో నిట్లనెను (9).

శంభురువాచ|

కస్మాద్యూయం సమాయాతా మత్సమీపం సురేశ్వరాః | హరి బ్రహ్మాదయస్సర్వే బ్రూత కారణమాశు తత్ || 10

శంభుడిట్లు పలికెను-

ఓ దేవతా శ్రేష్ఠులారా! బ్రహ్మ విష్ణువులను ముందిడు కొని మీరందరు నావద్దకు వచ్చుటకు గల కారణము వెంటనే చెప్పుడు (10).

బ్రహ్మోవాచ|

ఇతి శ్రుత్వా వచశ్శంభోస్సర్వే దేవా ముదాన్వితాః |
విష్ణోర్విలోకయామాసుర్ముఖం విజ్ఞప్తిహేతవే || 11

అథ విష్ణుర్మహాభక్తో దేవానాం హితకారకః | మదీరితమువాచేదం సురకార్యం మహత్తరమ్ || 12

తారకేణ కృతం శంభో దేవానాం పరమాద్భుతమ్ | కష్టాత్కష్టతరం దేవా విజ్ఞప్తుం సర్వ ఆగతాః || 13

హే శంభో తవ పుత్రేణౌరసేన హి భవిష్యతి | నిహతస్తారకో దైత్యో నాన్యథ మమ భాషితమ్ || 14

బ్రహ్మ ఇట్లు పలికెను-

శంభుని ఈ మాటలను విని దేవతలందరు ఆనందముతో నిండినవారై, శంభునకు విన్నవించు కొరకై విష్ణువు యొక్క ముఖము వైపునకు చూచిరి (11). అపుడు మహాభక్తుడు, దేవతలకు మేలు చేయువాడునగు విష్ణువు గొప్ప దేవకార్యమును సాధింపగోరి నేను చెప్పిన ఈ మాటలను పలికెను (12). హే శంభో! తారకుడు దేవతలకు పరమాశ్చర్యకరమగు పద్ధతిలో తీవ్రవేదనలను కలిగించుచున్నాడు. ఆ సంగతిని విన్నవించుటకై దేవతలందరు ఇచటకు వచ్చియున్నారు (13). హే శంభో! నీనుండి జన్మించిన నీ కుమారుని చేతిలో మాత్రమే ఈ తారకాసురుడు హతుడగును. నామాట తప్పు గాదు (14).

విచార్యేత్థం మహాదేవ కృపాం కురు నమోఽస్తుతే | దేవాన్ సముద్ధర స్వామిన్ కష్టాత్తారక నిర్మితాత్ || 15

తస్మాత్త్వయా గిరిజా దేవ శంభో గ్రహీతవ్యా పాణినా దక్షిణ   న |

పాణిగ్రహేణైవ మహానుభావాం దత్తాం గిరీంద్రేణ చ తాం కురుష్వ || 16

విష్ణోస్తద్వచనం శ్రుత్వా ప్రసన్నో హ్యబ్రవీచ్ఛివః | దర్శయన్ సద్గతిం తేషాం సర్వేషాం యోగతత్పరః || 17

ఓ మహాదేవా! నీవీ విషయమును విమర్శించి దయను చూపుము. నీకు నమస్కారమగు గాక! ఓ స్వామీ! తారకుడు కలిగించిన కష్టములనుండి దేవతలను ఉద్ధరించుము (15). హే దేవా! శంభో! కావున నీవు నీ కుడిచేతితో పార్వతిని స్వీకరించవలెను. పర్వతరాజు సమర్పించగా మహాపతివ్రతయగు ఆమెను పాణి గ్రహణము

చేయుము (16). విష్ణువు యొక్క మాటలను విని శివుడు ప్రసన్నుడాయెను. యోగ నిష్ఠుడగు శివుడు వారందరికీ మంచి మార్గమును చూపుచున్నవాడై ఇట్లు పలికెను (17).

శివ ఉవాచ|

యదా మే స్వీకృతా దేవీ గిరిజా సర్వసుందరీ | తదా సర్వే సురేంద్రాశ్చ మునయో ఋషయస్తదా || 18

సకామాశ్చ భవిష్యంతి న క్షమాశ్చ పరే పథి | జీవయిష్యతి దుర్గా సా పాణిగ్రహణతస్స్మరమ్ || 19

మదనో హి మయా దగ్ధస్సర్వేషాం కార్యసిద్ధయే | బ్రహ్మణో వచేనాద్విష్ణో నాత్ర కార్యా విచారణా || 20

ఏవం విమృశ్య మనసా కార్యాకార్యవ్యవస్థితౌ | సుధీస్సర్వైశ్చ దేవేంద్ర హఠం నో కర్తుమర్హసి || 21

శివుడిట్లు పలికెను-

నేను సర్వాంగ సుందరియగు పార్వతీ దేవిని స్వీకరించిన వాడు దేవతలు, దిక్పాలకులు, మునులు, ఋషులు అందరు (18) కోరిక తీరిన వారు కాగలరు. కాని వారు మోక్ష మార్గమునందు సమర్థులు కాజాలరు. పాణిగ్రహణ మాత్రముచే ఆ దుర్గ మన్మథుని జీవింపచేయగలదు (19). హే విష్ణో! అందరి కార్యము సిద్ధించుట కొరకై బ్రహ్మ యొక్క వచనమునను సరించి నేను మన్మథుని దహించితిని. ఈ విషయములో నీవు విమర్శ చేయకుము (20). ఏది కర్తవ్యము, ఏది కాదు అను వ్యవస్థను చేయుటలో వివేకి మనస్సులో చక్కగా విమర్శను చేయవలెను. ఓ దేవేంద్రా! నీవు దేవతలందరితో గూడి హఠమును చేయదగదు (21).

దగ్ధే కామే మయా విష్ణో సురకార్యం మహత్ కృతమ్ | సర్వే తిష్ఠంతు నిష్కామా మయా సహ సునిశ్చితమ్ || 22

యథా%హం చ సురాస్సర్వే తథా యూయమయత్నతః | తపః పరమ సంయుక్తాః కరిష్యధ్వం సుదుష్కరమ్ || 23

యూయం సమాధినా తేన మదసేన వినా సురాః | పరమానందసంయుక్తా నిర్వికారా భవంతువై || 24

పురా వృత్తం స్మరకృతం విస్మృతం యద్విధేహరే | మహేంద్ర మునయో దేవా యత్తత్సర్వం విమృశ్యతామ్ || 25

హే విష్ణో! నేను మన్మథుని దహించి గొప్ప దేవ కార్యమును చేసితిని. మీరందురు నాతో గూడి కామము లేనివారై ఉందురుగాక! ఇది నిశ్చయము (22). ఓ దేవతలారా! మీరందరు ప్రయత్నము లేకుండగనే నావలెనే గొప్ప ఏకాగ్రత గలవారై ఉగ్రమగు తపస్సును చేయుడు (23). ఓ దేవతలారా! మన్మథుడిపుడు లేడు గనుకమీరు పరమానందముతో గూడినవారై వికారములు లేనివారై సమాధినిష్ఠులు కండు (24). ఓ బ్రహ్మా! హే విష్ణో! మహేంద్రా! మునులారా! దేవతలారా! పూర్వము మన్మథుడు చేసిన పనిని మీరు విస్మరించినారు.

ఆ వృత్తాంతమునంతనూ విమర్శ చేయుడు (25).

మహాధనుర్ధరేణైవ మదనేన హఠాత్సురాః | సర్వేషాం ధ్యాన విధ్వంసః కృతస్తేన పురా పురా!! 26

కామో హి నరకాయైవ తస్మాత్క్రో ధోభిజాయతే | క్రోధాద్భవతి సంమోహెూమోహాచ్చ భ్రంశ##తే తపః ||27

కామక్రోధౌ పరిత్యాజ్యౌ భవద్భిస్సురసత్తమైః | సర్వైరేవ చ మంతవ్యం మద్వాక్యం నాన్యథా క్వచిత్ || 28

ఓ దేవతలారా! మహాధనుర్ధారి యగు మన్మథుడు పూర్వము హఠాత్తుగా అందరి ధ్యానమును నాశనము చేసినాడు (26). కామము నరకమునకు దారి తీయును. దాని నుండి క్రోధము పుట్టును.

క్రోధమునుండి వ్యామోహము పుట్టును. వ్యామోహము వలన తపస్సు భ్రష్టమగును (27).దేవతా శ్రేష్ఠులగు మీరందరు కామక్రోధములను విడనాడడు. నామాటను మననము చేయుడు నామాట ఎన్నటికీ అసత్యము కాబోదు (28).

బ్రహ్మోవాచ|

ఏవం విశ్రావ్య భగవాన్ మహాదేవో వృషధ్వజః | సురాన్ ప్రవాచయామాస విధివిష్ణూ తథా మునీన్ || 29

తూష్ణీం భూతో%భవచ్ఛంభుర్ధ్యానమాశ్రిత్య వై పునః | ఆస్తే పురా యథా స్థాణుర్గణైశ్చ పరివారితః || 30

స్వాత్మాన మాత్మనా శంభురాత్మన్యేవ వ్యచింతయత్ | నిరంజనం నిరాభాసం నిర్వికారం నిరామయమ్ || 31

బ్రహ్మ ఇట్లు పలికెను-

వృషభధ్వజుడు, భగవంతుడు అగు మహాదేవుడు బ్రహ్మ విష్ణువులను, మరియు దేవతలను మునులను ఉద్దేశించి ఈ విధముగా ధర్మమును బోధించెను (29). అపుడాయన మాటలాడుటను విరమించి మరల ధ్యానమగ్నుడై పూర్వములో వలెనే కదలిక లేనివాడై ఉండెను. గణములు ఆయనను చుట్టువారి యుండెను (30). సంగము, భ్రాంతి, వికారము, దోషము లేని ఆత్మతత్త్వమును శంభుడు తన మనస్సుచే తన హృదయము నందు ధ్యానించెను (31).

పరాత్పరతరం నిత్యం నిర్మమం నిరవగ్రహమ్ | శబ్దాతీతం నిర్గుణం చ జ్ఞానగమ్యం పరాత్పరమ్ || 32

ఏవం స్వరూపం పరమం చింతయన్ ధ్యానమాస్థితః | పరమానంద సంమగ్నో బభూవ బహుసూతికృత్ || 33

ధ్యానస్థితం చ సర్వేశం దృష్ట్వా సర్వే దివౌకసః | హరిశక్రాదయస్సర్వే నందినం ప్రోచురానతా || 34

ఉత్కృష్టమైన వాటి అన్నింటికంటె ఉత్కృష్టమైనది, నిత్యము, మమకారము లేనిది, శబ్దములకు అందనిది, నిర్గుణము, జ్ఞానము చేత మాత్రమే పొందబడునది (32) అగు పరమాత్మస్వరూపమును మనస్సులో ధ్యానిస్తూ, ఆ జగత్కారణుడగు శివుడు పరమానంద నిమగ్నుడై యుండెను (33). విష్ణువు, ఇంద్రుడు మొదలగు దేవతలందరు ధ్యానమునందున్న ఆ సర్వేశ్వరుని చూచి, నందీశ్వరుని ఉద్దేశించి వినయముతో నిట్లు పలికిరి (34).

దేవా ఊచుః |

కిం వయం కరవామాద్య విరక్తో ధ్యాన మాస్థితః | శంభుస్త్వం శంకరసఖస్సర్వజ్ఞశ్శుచిసేవకః || 35

కేనోపాయేన గిరిశః ప్రసన్నస్స్యాద్గణాధిప | తదుపాయం సమాచక్ష్వ వయం త్వచ్ఛరణం గతాః || 36

దేవతలిట్లు పలికిరి -

శంభుడు విరక్తుడై ధ్యానమునందున్నాడు. మేమిప్పుడు ఏమి చేయవలెను? నీవు శంకరుని మిత్రుడవు. సర్వము తెలిసిన వాడవు. శుద్ధహృదయము గల సేవకుడవు (35). ఓ గణాధ్యక్షా! ఏ ఉపాయముచే కైలాసపతి ప్రసన్నుడగునో, అట్టి ఉపాయమును చెప్పుము. మేము నిన్ను శరణు పొందుచున్నాము (36).

బ్రహ్మోవాచ|

ఇతి విజ్ఞాపితో దేవైర్మునే హర్యాదిభిస్తదా | ప్రత్యువాచ సురాంస్తాన్స నందీ శంభుప్రియో గణః || 37

బ్రహ్మ ఇట్లు పలికెను-

ఓ మహర్షీ! విష్ణువు మొదలగు దేవతలు ఈ విధముగా విన్నవించుకొనగా, శంభునకు ప్రియుడైన గణాధ్యక్షుడగు నందీశ్వరుడు ఆ దేవతలకు ఇట్లు ప్రత్యుత్తరము నిచ్చెను (37).

నందీశ్వర ఉవాచ|

హే హరే హే విధే శక్ర నిర్జరా మునయస్తథా ! శృణుధ్వం వచనం మే హి శివసంతోషకారకమ్ || 38

యది వో హఠ ఏవాద్య శివదారపరిగ్రహే | అతిదీనతయా సర్వే సునుతిం కురుతాదరాత్ || 39

భ##క్తైర్వశ్యో మహాదేవో న సాధారణతస్సురాః | అకార్యమపి సద్భక్త్యా కరోతి పరమేశ్వరః || 40

ఏవం కురత సర్వే హి విధివిష్ణుముఖాస్సురాః | యథాగతేన మార్గేణాన్యథా గచ్ఛత మాచిరమ్ || 41

నందీశ్వరుడిట్లు పలికెను-

హే విష్ణో! ఓ బ్రహ్మా! ఇంద్రా! దేవతలారా! మునులారా! శివునకు సంతోషమును కలిగించు మాటను చెప్పెదను. వినుడు (38). ఈనాడే శివుడు వివాహమాడవలెనని మీకు పట్టుదల ఉన్నచో, మీరందరు మిక్కిలి దైన్యముతో ఆదరముతో చక్కని స్తోత్రమును చేయుడు (39). దేవతలారా! సాధారణముగా వశముగాని మహాదేవుడు భక్తికి వశుడగును. ఆ పరమేశ్వరుడు మంచి భక్తిగల వాని విషయములో చేయదగని పనిని కూడ చేసిపెట్టును (40). బ్రహ్మ, విష్ణువు మొదలుగా గల ఓ దేవతలారా! మీరందరు ఈ తీరున చేయుడు. లాదా, ఆలస్యము చేయకుండగా వచ్చిన దారిని వెళ్లుడు (41).

బ్రహ్మోవాచ|

ఇత్యా కర్ణ్య వచస్తస్య మునే విష్ణ్వాదయస్సురాః | తథేతి మత్వా సుప్రీత్యా శంకరం తుష్టువుర్హి తే || 42

దేవ దేవ మహాదేవ కరుణా సాగర ప్రభో | సముద్ధర మహాక్లేశాత్త్రాహి నశ్శరణాగతాన్ || 43

ఇత్యేవం బహుదీనోక్త్యా తుష్టువుశ్శంకరంం సురాః lరురుదుస్సుస్వరం సర్వే ప్రేమవ్యాకుల మానసాః ll 44

హరిర్మయా సుదీనోక్త్యా సువిజ్ఞప్తిం చకారహ l సంస్మరన్మనసా శంభుం భక్త్యా పరమయా న్వితః ll 45

బ్రహ్మ ఇట్లు పలికెను-

ఓ మహర్షీ! విష్ణువు మొదలగు దేవతలు ఆతని మాటను విని అటులనే చేయుదమని అంగీకరించి, మిక్కిలి ప్రీతితో శంకరుని స్తుతించిరి (42). ఓ దేవ దేవా! మహాదేవా! కరుణా సముద్రా! ప్రభో! శరణుజొచ్చిన మమ్ములను ఈ మహాదుఃఖము నుండి ఉద్ధరించి రక్షించుము (43). దేవతలు ఈ తీరున మిక్కలి దీనమగు పలుకులతో శంకరుని స్తుతించిరి. ప్రేమచే నిండిన మనస్సుగల ఆ దేవతలందరు చక్కని స్వరముతో రోదించిరి(44). విష్ణువు నాతో కలిసి పరమమభక్తితో కూడినవాడై మనస్సులో శంభుని స్మరించుచూ మిక్కిలి దీనముగా విన్నవించుకొనెను (45)

సురైరేవం స్తుతశ్శంభు ర్హరిణా చ మయా భృశమ్ | భక్త వాత్సల్యతో ధ్యానదాద్విరతో%భూన్మహేశ్వరః || 46

ఉవాచ సుప్రపన్నాత్మా హర్యాదీన్ హర్షయన్ హరః | విలోక్య కరుణాదృష్ట్యా శంకరో భక్తవత్సలః || 47

నేను, విష్ణువు మరియు దేవతలు ఈ తీరును పరిపరివిధములస్తుతించగా, మహేశ్వరుడు భక్తుల యందలి ప్రేమచే ధ్యానమును ఆపివేసెను (46). భక్తవత్సలుడు, పాపహారియగు శంకరుడు మిక్కలి ప్రసన్నమగు మనస్సుగలవాడై విష్ణువు మొదలగు దేవతలకు ఆనందము కల్గునట్లు దయాదృష్టితో చూచి ఇట్లు పలికెను (47).

శంకర ఉవాచ |

హే విధే హే హరే దేవాశ్శక్రాద్యా యుగపత్సమే | కిమర్థ మాగతా యూయం సత్యం బ్రూత మమాగ్రతః || 48

శంకరుడిట్లు పలికెను-

ఓ బ్రహ్మా! హే విష్ణో! ఇంద్రాది దేవతలారా! మీరందరు ఒక్కసారి ఇచటకు వచ్చుటకు కారణమేమి? నా ఎదుట సత్యమును పలుకుడు (48).

హరి రువాచ|

సర్వజ్ఞస్త్వం మహేశాన త్వంతర్యామ్యఖిలేశ్వరః | కిం న జానాసి చిత్తస్థం తథా పచ్మ్యపి శాసనాత్ || 49

తారకాసురతో దుఃఖం సంభూతం వివిధం మృడ | సర్వేషాం సప్తదర్థం హి ప్రసన్నో%కారివై సురైః || 50

శివా సా జనితా శైలత్త్వ దర్థం హి హిమాలయాత్ | తస్యాం త్వదుద్భవాత్పుత్రాత్తస్య మృత్యుర్న చాన్యథా || 51

ఇతి దత్తో బ్రహ్మణా హి తస్మై#్మ దైత్యాయ యద్వరః | తదన్యస్మాదమృత్యుస్స బాధతే నిఖిలం జగత్ || 52

విష్ణువు ఇట్లు పలికెను-

ఓ మహేశ్వరా! నీవు సర్వజ్ఞుడవు. అంతర్యామివి. సర్వేశ్వరుడవు. మా మనస్సులోని మాట నీకు తెలియదా? అయిననూ, నీ శాసనముచే చెప్పుచున్నాను (49). హే మృడా! మాకందరికీ తారకాసురుని వలన అనేక రకముల దుఃఖము సంప్రాప్తమైనది. ఇందువలననే దేవతలు నిన్ను స్తుతించి ప్రసన్నునిగా చేసుకొనిరి (50). ఉమా దేవి నీకొరకై హిమవంతుని కుమార్తెగా జన్మించియున్నది. ఆమె యందు నీకు కలిగే పుత్రునిచే మాత్రమే ఆ తారకుడు సంహరింపబడును. దీనికి

మరియొక ఉపాయము లేదు (51). బ్రహ్మ అతనికి ఇట్టి వరమును ఇచ్చియున్నాడు. కావున ఇతరుల చేతిలో ఆతనికి చావు లేదు. ఆతడు జగత్తు నంతనూ పీడించుచున్నాడు (52).

నారదస్య నిదేశాత్సా కరోతి కఠినం తపః | తత్తేజసాఖిలం వ్యాప్తం త్రైలోక్యం సచరాచరమ్ || 53

వరం దాతుం శివాయై హి గచ్ఛ త్వం పరమేశ్వర | దేవదుఃఖం జహి స్వామిన్ అస్మాకం సుఖమావహ || 54

ఆ పార్వతి నారదుని ఉపదేశమును పొంది కఠినమగు తపస్సును చేయుచున్నది. స్థావర జంగమ ప్రాణులతో గూడిన ముల్లోకములు ఆమె యొక్కతేజస్సుచే వ్యాప్తమై యున్నవి (53). ఓ పరమేశ్వరా! నీవు ఆ పార్వతికి వరమునిచ్చుటకు వెళ్లుము. ఓ స్వామీ ! దేవతలమగు మా దుఃఖమును పోగొట్టి సుఖములనిమ్ము (54).

దేవానాం మే మహోత్సాహో హృదయే చాస్తి శంకర| వివాహం తవ సంద్రష్టుం తత్త్వం కురు యథోచితమ్ || 55

రత్యై యద్భవతా దత్తో వరస్తస్య పరాత్పర | ప్రాప్తో%వసర ఏవాశు సఫలం స్వపణం కురు || 56

ఓ శంకరా! దేవతలకు నాకు హృదయములో నీ వివాహమును చూడవలెననే ఉత్సాహము అధికముగా గలదు. కావున నీవు యథా యోగ్యముగా చేయుము (55). ఓ పరత్పరా! నీవు రతికి ఇచ్చిన వరమును నెరవేర్చే సమయము ఆసన్నమైనది. నీ ప్రతిజ్ఞను సఫలము చేయుము (56).

బ్రహ్మోవాచ|

ఇత్యుక్త్వా తం ప్రణమ్యైవ విష్ణుర్దేవా మహర్షయః | సంస్తూయ వివిధైస్స్తోత్రై స్సంతస్థుస్తత్పురో%ఖిలాః || 57

భక్తధీనశ్శంకరోఽపి శ్రుత్వా దేవవచస్తదా | విహస్య ప్రత్యువాచాశు వేదమర్యాద రక్షకః || 58

బ్రహ్మ ఇట్లు పలికెను-

విష్ణువు, దేవతలు, మహర్షులు ఇట్లు పలికి శివునకు నమస్కరించి అనేక స్తోత్రములతో చక్కగా స్తుతించి, వారందరు ఆయన ఎదుట నిలబడిరి (57). అపుడు భక్తులకు వశుడై ఉండే శంకరుడు కూడా దేవతల మాటలను విని నవ్వెను. వేద మర్యాదను రక్షించు శివుడు వెంటనే వారికి ఇట్లు బదులిడెను (58).

శంకర ఉవాచ|

హే హరే హే విధే దేవా శ్శృణుతాదరతోఽఖిలాః | యథోచితమహం వచ్మి సవిశేషం వివేకతః || 59

నోచితం హి విధానం వై వివాహకరణం నృణామ్ | మహానిగడ సంజ్ఞో హి వివాహో దృఢబంధనః || 60

కుసంగా బహవో లోకే స్త్రీసంగస్తత్ర చాధికః| ఉద్ధరేత్ సకలబంధైర్న స్త్రీసంగాత్ప్రముచ్యతే || 61

లోహదారుమయైః పాశైర్దృఢం బద్ధోఽపి ముచ్యతే | స్త్ర్యాదిపాశ సుసంబద్ధో ముచ్యతే న కదాచన || 62

శంకరుడిట్లు పలికెను-

ఓ హరీ! బ్రహ్మ! దేవతలారా! అందరు అదరముతో వినుడు. నేను వివేకముతో కూడియున్న యథోచితమగు ప్రత్యేక వచనమును చెప్పెదను (59). మానవులు వివాహమాడుట యోగ్యమగు కర్మ కాదు. వివాహము దృఢమగు బంధము. అది పెద్ద సంకెల అని చెప్పవచ్చును (60). లోకములో చెడు సంగములనేకములు గలవు. వాటిలో అన్నింటి కంటె అధికమైనది స్త్రీలతోడి సంగము. మానవుడు బంధములనన్నింటినీ విడిపించుకొనగలడు. కాని స్త్రీసంగము నుండి

విడిపించుకొనలేడు (61). ఇనుప సంకెళ్లతోగాని, చెక్కల సంకెలతో గాని దృఢముగా బంధింపబడిన వ్యక్తి విడిపించుకొనగలడు. కాని స్త్రీ అను పాశముచే బంధింపబడిన వ్యక్తి ఏనాటికైనను విముక్తుడు కాలేడు (62).

వర్ధంతే విషయా శ్శశ్వన్మహాబంధన కారిణః |
విషయాక్రాంతమనసస్స్వప్నే మోక్షో%పి దుర్లభః || 63

సుఖమిచ్ఛతు చేత్ర్పాజ్ఞో విషవత్ విషయంస్త్యజేత్ |
విషవద్విషయానాహు ర్విషయైర్వినిహన్యతే || 64

జనో విషయిణా సాకం వార్తాతః పతతి క్షణాత్ | విషయం ప్రాహురాచార్యాస్సితాలిప్తేంద్రవారుణీమ్ || 65

యద్యప్యేవం హి జానామి సర్వం జ్ఞానం విశేషతః | తథాప్యహం కరిష్యామి ప్రార్ధనాం సఫలాం చ వః || 66

దృఢముగా బంధించే ఈ ఇంద్రియ సుఖములు ఎల్లవేళలా వృద్ధి పొందుచుండును. భోగలాలసతతో నిండిన మనస్సు గలవానికి మోక్షప్రాప్తి స్వప్నమునందైననూ అసంభవము (63). వివేకవంతుడగు మానవుడు సుఖమును కోరువాడైనచో విషయ సుఖములను విషమునువలె విడువవలెను. విషయ సుఖములు విషమువంటివని పెద్దలు చెప్పెదరు. ఇంద్రియసుఖములు మానవుని నాశమును గొనితెచ్చును (64). భోగలాలసునితో మాటలాడు వ్యక్తి కూడ క్షణములో పతితుడగును. ఇంద్రియ సుఖములు మానవుని నాశమును గొని తెచ్చును (64). భోగలాలసునితో మాటలాడు వ్యక్తి కూడ క్షణములో పతితుడగును. ఇంద్రియ సుఖములు పంచదార స్పటికము కలిపిన మద్యము వంటి వని ఆచార్యులు చెప్పుచున్నారు (65). సర్వజ్ఞానములు నాకు ఎరుకయే. అయిననూ, మీ ప్రార్ధనను నేను సఫలము చేసెదను (66).

భక్తాధీనో%హ మేవాస్మి తద్వశాత్సర్వకార్యకృత్ | అయథోచితకర్తా హి ప్రసిద్ధో భువనత్రయే || 67

కామరూపధిపస్సై#్యవ పణశ్చ సఫలః కృతః | సుదక్షిణస్య భూపస్య భైమబంధగతస్య హి || 68

గౌతమక్లేశకర్తాహం త్ర్యంబకాత్మా సుఖావహః | తత్కష్ట ప్రదదుష్టానాం శాపదాయీ విశేషతః || 69

విషం పీతం సురార్థం హి భక్త వత్సల భావధృక్ | దేవకష్టం హృతం యత్నాత్సర్వదైవ మయా సురాః || 70

నేను మాత్రమే భక్తులకు అధీనుడనై సర్వకార్యములను వారి ఇచ్ఛను అనుసరించి చేయుదును. భక్తుల కొరకై నేను ఉచితము కాని పనిని కూడ చేసెదనని ముల్లోకములలో ప్రసిద్ధి గలదు (67). భీమ మహారాజుచే బంధింపబడిన సుదక్షిణుడనే కామరూప దేశాధిపతి యొక్క ప్రతిజ్ఞను సఫలము చేసితిని (68). ముక్కంటినగు నేను గౌతముని కష్టములను తొలగించి, సుఖములను కలిగించి, ఆయనకు కష్టమును కలిగించిన దుష్టులకు కఠిన శాపములనిచ్చి యుంటిని (69). భక్తవాత్సల్య మే నా స్వరూపము గనుకనే, నేను దేవతలకొరకై విషమును త్రాగితిని. ఓ దేవతలారా! నేను అన్ని వేళలా దేవతల కష్టమును యత్నపూర్వకముగా నివారించియుంటిని (70).

భక్తార్థమసహం కష్టం బహుశో బహుయత్నతః | విశ్వానరమునేర్దుః ఖం హృతం గృహపతిర్భవన్ || 71

కిం బహూక్తేన చ విధే హరే సత్యం బ్రవీమ్యహమ్ | మత్పణో%స్తీతి యూయం వై సర్వే జానీథ తత్త్వతః || 72

యదా యదా విపత్తిర్హి భక్తానాం భవతి క్వచిత్ | తదా తదా హరామ్యాశు తత్ క్షణాత్సర్వశస్సదా || 73

జానేఽహం తారకాద్దుఃఖం సర్వేషాం వస్సముత్థితమ్ |
అసురాత్తద్ధరిష్యామి సత్యం సత్యం వదామ్యహమ్ || 74

నేను అనేక పర్యాయములు అధిక ప్రయత్నమును చేసి భక్తుల కొరకై కష్టమును సహించితి. నేను గృహపతినై విశ్వానరమహర్షి యొక్క దుఃఖమును తొలగించితిని (71). ఓ బ్రహ్మా! హే విష్ణో! పెక్కు మాటలేల? నేను సత్యమును పలుకుచున్నాను. నేను ప్రతిజ్ఞను చేసితినని మీరందరు ఎరుంగుదురు. ఆ ప్రతిజ్ఞ యొక్క తత్త్వము మీకు తెలియును (72). ఎప్పుడైననూ ఎక్కడైననూ భక్తులకుకష్టము వచ్చినచో, నేను అప్పుడు అక్కడ వెంటనే ప్రత్యక్షమై ఆ కష్టమును తొలగించెదను (73). మీకు అందరికీ తారకాసురుని వలన సంప్రాప్తమైన దుఃఖమును గురించి నేను ఎరుంగుదును. నేనా దుఃఖమును తొలగించెదను. నేను ముమ్మాటికీ సత్యమును పలుకుచున్నాను (74).

నాస్తి యద్యపిమే కాచి ద్వ్యహారకరణ    రుచిః | వివాహయిష్యే గిరిజాం పుత్రోత్పాదనహేతవే || 75

గచ్ఛత స్వగృహాణ్య   వ నిర్భయాస్సకలాస్సురాః | కార్యం వస్సాధయిష్యామి నాత్ర కార్యా విచారణా || 76

నాకు భోగవిలాసముల యందు అభిరుచి లేకపోయిననూ, పుత్ర సంతానము కొరకై పార్వతిని వివాహమాడెదను (75). దేవతలారా! మీరందరు నిర్భయముగా మీ గృహములకు వెళ్లుడు. మీ కార్యమును నేను సిద్ధింపజేసెదను. మీరీ విషయములో విచారించకుడు (76).

బ్రహ్మోవాచ |

ఇత్యుక్త్వా మౌనమాస్థాయ సమాధిస్థోఽభవద్ధరః | సర్వే విష్ణ్వాదయో దేవాస్స్వధామాని యయుర్మునే || 77

ఇతి శ్రీ శివమహాపురాణ    రుద్ర సంహితాయాం పార్వతీ ఖండే పార్వతీ వివాహస్వీకారో నామ చతుర్వింశోఽధ్యాయః (24).

బ్రహ్మ ఇట్లు పలికెను -

శివుడు ఇట్లు పలికి మౌనమును వహించి సమాధిలోనికి వెళ్లిపోయెను. ఓ మహర్షీ! విష్ణువు మొదలగు దేవతలందరు తమ ధామములకు వెళ్లిరి (77).

శ్రీ శివ మహాపురాణములో రుద్ర సంహితయందు పార్వతీ ఖండలో పార్వతీ వివాహ స్వీకారమనే ఇరువది నాలుగవ అధ్యాయము ముగిసినది (24).